సాధన గ్రంథ మండలి, 51.

# గోవింద దామోదర స్తోత్రము

బిల్వమంగళుని సంస్కృత
కృతికి ఆంధ్ర వివృతి

ఆంధ్ర వివృతి కారుడు
శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
ఉభయ భాషా ప్రవీణ

• సాధన • గ్రంథ • మండలి • తెనాలి •

వెల ఎనిమిది అణాలు

తమే. నేటికి ముప్పదియైన గ్రంథములు వెలువడినవి. మండలికి మూలధనము లేకపోవుటయు, చాలినంతగా పోషకవర్గము లేకపోవుటయు, ఉన్న పోషకవర్గము వారందరు సరిగా నాదరించకబోవుటయు నీ మొదలగు కారణములచే నేటికి రెండు వేల రూప్యములకు పైగా ఋణమై అనేక కష్టనష్టములకు లోనై మండలిని నడుపుచుంటిమి. రాజపోషకులు, పోషకులు, సభ్యులు, అభిమానులు నేటికి 2, 3 సంవత్సరముల తాలూకు పారితోషికము మండలి కివ్వవలసియుండిరి. వారికి జాబులు వ్రాసి హెచ్చరించితిమి. కొందరు సమాధానము గూడ నివ్వలేదు. దయయుంచి, మండలి చిరకాలము వర్ధిల్లునటుల కోరుచు, లోగడ తామివ్వవలసిన పారితోషికములను వెంటనే పంపి, మా కృషిని ప్రోత్సహింపగోరుచుంటిమి. ఇట్టి సంస్థలు జేయు కృషి యీనాడు లోకమున కెక్కుడు అవసరము. కాన మండలియెడ మీ విధ్యుక్తధర్మమును వెంటనే నిర్వర్తించుచు మీ మిత్రులను గూడ మా కృషికి ప్రోత్సహింప ప్రార్థన.

రాబోవు గ్రంథము శ్రీ మధుసూదన సరస్వతీ విరచితమగు “ భక్తిరసాయనము ” ఆంధ్రవివృతితో తయారగుచున్నది. 200 పేజీలకు పైగా ముద్రణ అయినది.

విజయచైత్రము.
తెనాలి, 1953.

వ్యవస్థాపకుడు
బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
సాధన గ్రంథ మండలి.

# మధురాష్టకము

## ( శ్రీమద్వల్లభాచార్య కృతము )

అధరం మధురం వదనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౧

వచనం మధురం చరితం మధురం
వసనం మధురం వలితం మధురం
చలితం మధురం భ్రమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౨

వేణు ర్మధురో రేణు ర్మధురః
పాణీ మధురౌ పాదౌ మధురౌ
నృత్యం మధురం సఖ్యం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౩

గీతం మధురం పీతం మధురం
భుక్తం మధురం సుప్తం మధురం
రూపం మధురం తిలకం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౪

కరణం మధురం తరణం మధురం
హరణం మధురం రమణం మధురం
వమితం మధురం శమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౫

గుంజా మధురా మాలా మధురా
యమునా మధురా వీచీ మధురా
సలిలం మధురం కమలం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౬

గోపీ మధురా లీలా మధురా
యుక్తం మధురం ముక్తం మధురం
దృష్టం మధురం శిష్టం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౭

గోపా మధురా గావో మధురా
యష్టి ర్మధురా సృష్టి ర్మధురా
దలితం మధురం ఫలితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం. ౮



# సమీక్ష

కరారవిందేన పదారవిందం, ముఖారవిందే వినివేశయన్తమ్
వటస్య పత్రస్య పుటే శయానంబాలం ముకుందం మనసా స్మరామి.

ప్రాచీనకాలమందలి కొందరకవుల జీవితములను తెలిసికొనుటకు తగిన యాధారములు కానరావు. వారి రచనలవలన కూడ కాల నివాసాదులు తెలియవు. కొందరు కవులు తమకు గల యసలు నామమును గ్రంథమున చెప్పక, బిరుదునామమునుగాని, ఇతర నామమునుగాని గ్రంథమును చెప్పటచే కవి పుట్టుపూర్వోత్తరములు తెలియకుండుట కీవిషయము ప్రజల కారణము. అట్టివారిలో బిల్వమంగళు డొకడు.

ఈతని చరిత్ర తెలిసికొనుటకు తగిన యాధారములు లేవు. ఈతని పేరున "గోవింద దామోదర స్తోత్రము"మాత్రము కనిపించు చున్నది. "శ్రీకృష్ణకర్ణామృతము" కూడ నితనిదే అను ప్రతీతికలదు. ఈ గ్రంథమున "లీలాశుకుడు" అని గ్రంథ కర్తృ నామము గలదు. బిల్వమంగళునికి 'లీలాశుకుడ'ని ఉప నామము గలదనియు నొక ప్రతీతి కలదు.

బిల్వమంగళునికి చింతామణి యను ఉంపుడుకత్తె కల దనియు, చివరికి ఆమెవలన ప్రబోధితుడుకాగా ఆమెను

గురువుగా భావించె ననియు, అందుచే శ్రీకృష్ణకర్ణామృతమున ప్రారంభములో చింతామణిని స్మరించెననియు చెప్పుదురు.

"చింతామణి ర్జయతి సోమగిరి ర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛ మౌళిః
యత్పాద కల్పతరు పల్లవశేఖరేషు
లీలాస్వయంవర రసం లభతే జయశ్రీః" — శ్రీకృష్ణకర్ణామృతము

ఈ శ్లోకమందలి 'చింతామణి' శబ్దము బహువిధముల భాసించుచున్నది. బిల్వమంగళుడు 'చింతామణి'ని గురువుగా భావించెననియు, ఇతడు 'చింతామణి' (మంత్రము) ఉపాసకు డనియు, తనగురువు 'సోమగిరి' చింతామణి వంటివాడనియు లేదా తనయిష్టదైవమగు శ్రీకృష్ణుడు భక్తులపాలిట చింతామణి వంటివాడనియు, లేక శ్రీకృష్ణకర్ణామృతము భక్తులకు చింతామణివంటిదనియు ఇన్ని యర్థములకు తావిచ్చుచున్నది. నా అజ్ఞానమును పారద్రోలి విజ్ఞానము నొసగిన చింతామణికిని, గోపాలమంత్రము ననుగ్రహించిన దీక్షాగురువగు సోమగిరికిని జయ మగు గాక! నాకు శిక్షాగురువగు శిఖిపింఛధారియగు శ్రీకృష్ణునకు జయమగుగాక! ఈకారణముల పురస్కరించుకొని శ్రీకృష్ణకర్ణామృతముకూడ బిల్వమంగళ విరచితమెయని విమర్శకుల యభిప్రాయము.

బిల్వమంగళుడు శ్రీకృష్ణధ్యానతత్పరుడై గోపబాలక వేషధారియగు శ్రీకృష్ణుని సాయమున బృందావనయాత్ర

ప్రయాణించుచు, బృందావన సమీాపమున శ్రీకృష్ణానుగ్రహమున దివ్యచక్షువు రాగా, శ్రీకృష్ణుని హ_స్తమును గట్టిగ పట్టుకొని ప్రార్థించుతరి, పరమాత్మ చేయివిదలించుకొని ముందుకునడచుచుండ, నీక్రిందివిధముగ భక్తుడగు బిల్వమంగళుడు శ్రీకృష్ణునిగూర్చి యధిక్షేపించెను.

"హ_స్త మాక్షిప్య యాతో౽పి బలాత్కృష్ణ కి మద్భుతమ్
హృదయాద్యది నిర్యాసి, పౌరుషం గణయామి తే."

— శ్రీకృష్ణకర్ణామృతము.

ఈశ్లోకము శ్రీకృష్ణకర్ణామృతముననుండుటచే, శ్రీకృష్ణకర్ణామృతముకూడ బిల్వమంగళ విరచితమె యని సిద్ధాంతము.

మరియు గుంటూరు జిల్లాలోని కృష్ణాతీరమందలి కొల్లూరు, ఈతని నివాసస్థానమనియు చెప్పుదురు. కాల నిర్ణయములోకూడిన యీతనిచరిత్ర యింతకన్న విశేషములతో నెవరయిన తెలిపిన మలిముద్రణమున ముద్రించగలను.

బిల్వమంగళుడు గృహస్థుడనియు భార్య మహా సాధ్వి యనియు నదీతరణమున భ_ర్తకు తోడ్పడదలచి నదిలోపడి చనిపోయెనని యనుశ్రుతముగ వచ్చు వదంతి కలదు. కాని ఇంతవరకు గల చరిత్రలలో గాని విమర్శకుల దృష్టిపథములో గాని యీవిషయము గానరాదు.

సూరదాసు బిల్వమంగళుడు ఒక్కరే అను ప్రతీతి కూడ కలదు. కాని సూరదాసుకి జననకాల నిర్ణయము కలదు.

సూరదాసుకీ యితనికీ కొన్ని విషయములలో కించిత్‌గా పోలికలు గలవు. తండ్రిపేరు మాత్ర మొకటిగా కనిపించు చున్నది. సూరదాసు డొకనాడు సౌందర్యవతి యగుస్త్రీని చూచి వెంటనే తనలో వైరాగ్యముకలిగి ఆ స్త్రీ వలన రెండు సూదులు తెప్పించి నేత్రభంగ మొనర్చుకొని, బృందావన మున శ్రీకృష్ణధ్యానముతో చిరకాలముండి భక్తిరసప్రపూరి తములగు గేయముల రచియించుచు, భగవద్దర్శనముసుపొంది చివరకు భగవంతునిలో లీనమయ్యెను. ఇతడు సంస్కృత గ్రంథములు రచియించి నటు లెచటను గానరాదు. బిల్వ మంగళుడు అంధుడైన నాటినుండియు సూరదాసుడుగ పరిగ ణింపబడినట్లు జనశ్రుతి. కాని ఇంతమాత్రముచే వీరుభయులు నొక రనుట సమంజసముగాదు. బిల్వమంగళుని చరిత్రలో విపులముగ నాతని గ్రంథ రచన గురించిన విషయము గలదు. ఇట్టి సందేహములకు గురియగు కవులజీవితము లనేకములు గలవు. కాలగర్భమున లీనముకాగా మిగిలిన విషయముల వలననైన సత్యమగు చరిత్రలు చదువుకొనుభాగ్యము మన కెప్పటికోగదా!

ప్రస్తుతము గీతాప్రెస్‌వారిచే ప్రచురింపబడిన భక్తుల చరిత్రలో బిల్వమంగళుని జీవితము కలదు. దానిని ఆధారముగ జేసికొని నే సంగ్రహించిన యితరవిషయములను కూర్చి బిల్వ మంగళుని జీవితమును, ఈ క్రింద వ్రాయుచుంటిని.

# బిల్వమంగళుడు

పవిత్రమగు కృష్ణవేణా (వేణీ) నదీతటమున నొక గ్రామము కలదు. అందు వేదాధ్యయనపరుడు, సకలధర్మ శాస్త్రవేత్తయు నగు రామదాసను నొక విప్రుఁడు కలడు. ఈతని పుత్రుడే బిల్వమంగళుడు. బిల్వమంగళునకి యథాకాలమున చౌలోపనయన సంస్కారములగావించి, గురుకులమున కంపెను. బిల్వమంగళుని బాల్యమంతయు గురుకులవాసమున గడచెను. సకలశాస్త్రములు, వేదములు అధ్యయనము చేసెను. పూవు పుట్టగనే పరిమళించునట్టుల, బిల్వమంగళునికి బాల్యము నుండియు గురుపూజ, భగవద్భక్తి, అతిథిసేవ, మొదలగు సద్గుణముల లవడెను. తండ్రియొక్క భక్తిభావములన్నియునలవడెను. కాలాంతరమున తల్లితండ్రులు గతించిరి. బిల్వమంగళుడు గృహయజమాని యయ్యెను. పైతృక సంపద యంతయు నితని యధీనమయ్యెను.

> "యౌవనం ధనసంపత్తిః, ప్రభుత్వ మవివేకితా,
> ఏకైక మప్యనర్థాయ, కిము యత్ర చతుష్టయమ్."

యౌవనము, సంపద, అధికారము, అవివేకము ఇవి యొక్కొక్కటియే అనర్థముచేకూర్చును. నాలుగును నున్నచో చెప్పవలసినదేమి!

బిల్వమంగళుని కమితముగ సంపదయున్నది. ఆతనిని అదుపాజ్ఞలలో బెట్టువారెవరును లేరు. తనకు తానే అధికారి. అందుమీాద క్రమముగ దుర్జనసాంగత్యమువలన వివేకముగూడ నశించెను. అతడు పూర్ణముగ యుక్తాయుక్త వివేచనా శూన్యుడయ్యెను.

సాంగత్యదోష మెంతటి పనినైనను చేయించును. బిల్వమంగళుడు దుష్టసాంగత్యముచే ననేక వ్యసనములకు లోనయ్యెను. ఒకదినమున నా గ్రామములో, చింతామణి యను వేశ్యయొక్క నృత్యము జరుగుచుండెను. పండితులు, రసికులు, విలాసులు ఆమెనృత్యముజూడ నేగుచుండిరి. బిల్వమంగళుడు కూడతనమిత్రులవెంట సర్వశాలకేగెను చింతామణి భూలోక సుందరి. హావభావముల చక్కగ నభినయించుచు నాట్యము చేయుచుండెను. బిల్వమంగళుడు చింతామణీ సౌందర్యమును గని విహ్వల చిత్తుడయ్యెను. అతని బుద్ధి వివేకశూన్యమాయెను. అతడు పతితుడయ్యెను — తుచ్ఛము, నీచము నగు ఆమె శరీరమునకు, బిల్వమంగళుడు తన శరీరమును, మనస్సును, ఇంద్రియములను, కులమును, మర్యాదను, ధర్మమును వేయేల తన సర్వస్వమును అర్పించెను. బ్రాహ్మణకుమారుడు పూర్తిగ పతితుడయ్యెను. జాగ్రత్స్వప్నములయందు ఆహార పానీయములందు సర్వకాలములయందును చింతామణి చింతనే తప్ప వేరొండు లేదు. స్త్రీ మోహితుడగు వానికి యితరము తెలియు నవసరము లుండవుగదా !

బిల్వమంగళుని యింట నాడు పైతృకము. విహిత ధర్మకర్మాచరణా సక్తులగు పౌరోహితుల బలవంతముచేతను, పితృకర్మాసక్తిగల యిరుగుపొరుగువారి మందలింపులచేతను బిల్వమంగళునకు నా డింట నుండక తప్పినదికాదు. కాని మనస్సు చింతామణికడ, కట్టె గృహమున. శ్రాద్ధము జరుగు చున్నంత కాలము మనస్సులో చింతామణి చింతనయె. శ్రాద్ధము నెటులో పూర్తిచేసి, చింతామణి గృహమునకు పోవుట కుద్యుక్తు డయ్యెను.

బిల్వమంగళుని అర్ధాంగి మహాసాధ్వి. ఆమెకు భర్తృ దైవము కన్న వేరొండు లేదు. భర్త దినచర్య యిట్లున్నను, ఆమె తన పతివ్రతా ధర్మమునకు లోపము రానీయకుండ జీవిత మును గడపు చుండెను. భర్తృదర్శనమును భగవ ద్దర్శనముగ భావించెడిది. నిత్యము భర్తయొక్క చిత్రపటమును భక్తితో నారాధించు చుండెడిది. ప్రయాణోన్ముఖు డగు బిల్వమంగళుని జూచి, నాధా! నేడు పైతృక మాచరించితిరిగదా! నేడు గృహమున నుండి రేపుదయమే చింతామణి గృహమున కేగుడు. పితృకర్మకూడ సిద్ధించ గలదు. అని బహుముఖముల ప్రార్థించెను. ఆమె మాటలు బిల్వమంగళుని కర్ణముల ప్రవే శించలేదు. వెంటనే గృహము నుండి వెలుపలకు రాగా, తోటివారందరు, నాయనా! నేడు పైతృక మాచరిం చితివి. ఇట్లు పోగూడదు, అని యనేకవిధముల జెప్పిరి. ఈధర్మ వాక్యము లన్నియు నాతనికడ చెవిటివానికి శంఖూది నట్లా

యెను. అతని హృదయ మెన్నడో ధర్మశూన్య మయ్యె. చింతామణి గృహము నది కావలి తీరమున గలదు. బిల్వమంగళు డెటులనో నదీతీరము చేరెను. అప్పటికి సాయం సమయ మగుచుండెను. దైవగతి యతి విచిత్రము.

కొంచెము పిల్లగాలులు వీవసాగెను. ఆకాశమున చిన్న మేఘములు బయలుదేరెను. చిటపటచినుకులతో, క్షణములో చూచుచుండగనే ఝంఝామారుతములు వీచసాగెను. ఆకసము మేఘావృతమయి యంధకారబంధురమయ్యెను. కన్నులు మిరుమిట్లు గొలుప మెరుపులు మెఱయు చుండెను. కుంభ వృష్టి యారంభమాయెను. క్షణములో నది వేలాతిగముగ ప్రవహింప సాగెను. మేఘగర్జనలకు, విద్యుత్పాతములకు, ప్రాణు లన్నిటికి జీవిత మందాశ సన్నగిల్లెను. అహర్నిశము నిర్భీకులైనదీమధ్యమున సంచరించు నావికులు, తమ నౌకలను తీరమునకు జేర్చి సాంద్రవృక్ష మూలముల నాశ్రయించి, గజగజలాడుచు, ప్రాణముల నరచేత బట్టుకొని యుండిరి.

ఈ ఉత్పాతముల జూచుచున్న గృహమునగల బిల్వమంగళుని భార్య కొక్కమారుగ భయము ప్రేమ కలిగినవి. తననాథుడెటులైనను నేడు చింతామణి గృహము జేరకమానడని నిశ్చయించి, తన భర్తకుపకరింపని యీదేహమేల? అని నిశ్చయించి భర్తను మనసార ధ్యానించి, సమస్తదేవతలకు నమస్కరించి, యారాత్రి సమయమున ఒంటరిగా నదీ

తీరము జేరి, ఓ నదీదేవతా! నా యీశరీరము నా భర్తకు నదిని దాటుటకు తోడ్పడునట్లు చేయుదువు గాక, అని తన శరీరమును నదికి సమర్పించెను.

బిల్వమంగళుని చిత్తమున కీయుత్పాతములు భయమునుగాని, ఔదాసీన్యమునుగాని యించుకైనను కలింగించలేదు. ఆతడు నావికులను తన్నానదిని దాటించమని కోరెను. విశేష ధనమొసంగెదననెను. బహువిధముల దీనాతిదీనముగ ప్రార్థించెను. కాని మృత్యువు నెదుర్కొనుట కెవడు సంసిద్ధుడగును? ఈతని ప్రార్థనను నావికులందరు తిరస్కరించిరి. విలంబమయిన కొలది బిల్వమంగళుని వ్యాకులత్వ మధికమగుచున్నది. ముందువెనుక లాలోచించక, యాతడు స్వయముగ నీది నదిని తరించుట కుద్యుక్తు డయ్యెను. ఆహా! భయంకర సాహస కార్యము. "కామాతురాణాం న భయం న లజ్జా" నదిలో దిగెను. ఈదుచుండెను. దైవవశమున నదియందొక శవము కొట్టుకొని పోవుచుండెను. బిల్వమంగళునకు స్మృతి తప్పుచుండెను. అట్టితరి యాశవమును ఆధారముగ గొనెను. దానిని ఆతడు దారుఖండముగ భావించి, దానియాధారమున తీరమును జేరెను.

కన్ను పొడుచుకున్నను కానరాని యా చిమ్మచీకటిలో, దారి తెన్నులు గానరాక నడచు చుండెను. వన్యమృగములు భీకరముగ నఱచు చుండెను. ఎచ్చటను మనుష్య వాసనగూడ

లేకుండెను. బిల్వమంగళు డున్మత్తునివలె పోవుచుండెను, తుదకు చింతామణీగృహము జేరెను — నాడు పైత్యకమగుటచే బిల్వమంగళుడు రాడని యెంచి, చింతామణి తలుపులన్నియు మూసి, లోన నిద్రించు చుండెను. బిల్వమంగళుడు గొంతెత్తి పలుమారులు పిలచెను. అస్తి నాస్తి యను సమాధానము రాలేదు. ఏమిచేయుటకును ఆతనికి తోచకుండెను. విద్యుత్ప్రకాశమున నటునిటు జూచెను. ప్రక్క గోడనుండి యొక త్రాడు వ్రేలాడుచున్నటుల గోచరించెను. వెంటనె దానిని ఆధారముగ గొని, గోడదాటి యింట ప్రవేశించెను. చింతామణిని సమీపించి, యామెను మేల్కొలిపెను. ఆమె యీతని గాంచగనే నిశ్చేష్ట యయ్యెను. బిల్వమంగళుడు, వికృతముగ నుండెను. అంత నామె " నీ వీ భయంకర యర్ధరాత్రమున నదిని యెట్లు తరించితివి ? ద్వారము లన్నియు మూయబడియున్న గృహమున నెట్లు ప్రవేశించితివి ? " అని ప్రశ్నించెను. దారు ఖండ మూలమున నదిని తరించి, రజ్జుసహాయమున గృహమున ప్రవేశించుట యాది గాగల సర్వమును బిల్వమంగళుడు నివేదించెను.

వర్ష మాగెను. చింతామణి దీపము చేబూని బిల్వమంగళుని వెంటనిడుకొని, గోడమీదగల రజ్జువును పరికించగా నటనొక భయంకరమగు నల్లత్రాచుపాము వ్రేలాడు చుండెను. వెంటనే యాశ్చర్యముచెంది నదీతీరమున కేగ నట నొక స్త్రీ శవము కనిపించెను. శవమును పరికించగ నామె బిల్వమంగళుని

భార్య. చింతామణి నిశ్చేష్ట యయ్యెను. ఇంద్రియములు స్తంభించెను. ఆశవమును చూడగనే బిల్వమంగళుని శరీరము, ఆపాదమస్తకము కంపించెను. శిలాప్రతిమవోలె స్తబ్ధుడాయెను. అంత చింతామణి తెప్పరిల్లి, "ఓయీ! నీవు బ్రాహ్మణుడవు, పండితుడవు, సకల ధర్మములు తెలిసిన వాడవు. విశేషించి నేడు నీతండ్రి శ్రాద్ధము. కాని, నీవు చీము, నెత్తురు, వస, మలము, మూత్రములతో కూడిన శరీరమున మోహితుడవై, సర్వవిధ ధర్మ కర్మల త్యజించి, యీ భయంకర నిశీధమున భార్యశవ, సర్ప సహాయమున నిటకు వచ్చితివి. ఉత్తమ సాధ్విని పోగొట్టు కొంటివి. పంకమువంటి సంసారమను నదిలో చేతులార ముంచితివి. అంతులేని నీపాపమునకు నిష్కృతి కలదా? ఈవిషయమున నేనును భాగస్వామినే. నా పాపమునకు మాత్రము శాంతియున్నదా? నీవు నేడు నన్ను పరమసుందరి యని భావించి యున్మత్తుడవై సంచరించు చుంటివి. కాని నా యీ శరీరసౌందర్యముకూడ నొకప్పుడు శవమునవలెనే పరిణతి జెందును. ఆహా! స్త్రీరూప మెంతటి మోహనశక్తి. మానవ జీవితమును అధఃపతితము జేయుచున్నదిగదా! ఛీ! ఎంతటి నీచవృత్తి! ఓయీ! నీ వీవిధముగ నాభువనమోహను డగు శ్యామసుందరునియందు దాసక్తుడవైన – ఆతని కలుసుకొనుట కీవిధముగ వ్యాకులత్వముతో పరిగ్విడిన సర్వకాలముల నాతనిని స్మరించిన ఆతనినే ధ్యానించిన యాతని యాలింగనము

సమాకృష్టు డయ్యెను. బిల్వమంగళు డాయువతి వెంట నామె యింటివరకు నేగెను. ఆమె తనయింటిలో ప్రవేశించెను. బిల్వమంగళు డుదాసీనముగ గృహద్వారమున గూరుచుండెను. గృహమేధి బయటికివచ్చి దీనవదనముతోను, జీర్ణవసనము తోను, కూర్చునియున్న బ్రాహ్మణునినిగాంచెను. అతిథిసేవా తత్పరు డగు నాతడు బిల్వమంగళు నాదరించి రాకకుగల కారణ మడిగెను. బిల్వమంగళుని హృదయమున నైహికాముష్మిక సంపదలకు రెంటికిని ఘోరమగు సంఘర్షము జరుగు చుండెను. ఒకప్పుడు ఐహికసుఖసంపదలు హృదయరంగమున విజయమును సాధించిన వేరొకప్పు డాభువనమోహన సుందర నందకుమార శ్యామసుందర చరణారవిందములందలి భక్తి తాత్పర్యము నాతని హృదయసామ్రాజ్యము నేల జూచు చుండెను. ఇట్టి ద్వంద్వమున నాతడు తనస్థితి నంతను కపటము విడచి యాగృహమేధికి యిట్లని నివేదించెను. అయ్యా! "లోని కేగిన యా యువతిని ఒకపర్యాయము మనసార జూడదలచు చుంటి"నని పలికెను. నిష్కపటియగు నా బ్రాహ్మణునకామెను జూపదలచి అతిథివత్సలుడగు గృహమేధి భార్యను బిలచు టకై యింటిలోనికి వెళ్లెను. ఇచ్చట బిల్వమంగళుని హృద యాంతరమున వివిధభావము లొక్కుమ్మారుగ చెలరేగి ఘోరమగు సంఘర్షణ ప్రారంభించెను.

ఒక్క పర్యాయ మా దీనజనబంధుని శరణొందిన వాని యోగక్షేమ ( భగవత్ప్రాప్తి యోగమనియు, దానికై చేయు

నుపాయ సంరక్షణమునకు క్షేమ మనియు పేరు.) భారమును, ఆ సర్వవ్యాపి వహించును. నేడు బిల్వమంగళుని సరిదిద్దు భారమునుగూడ నాతడే వహించెను. అజ్ఞానాంధుడగు బిల్వమంగళునకు దీనవత్సలుడగు భగవంతుడు దివ్యచక్షువు లను ప్రసాదించెను. బిల్వమంగళునకు తన స్థితియంతయును యథార్థముగ గోచరించెను. హృదయము శోక భరితమయ్యెను. ఆతడు మ్లానహృదయుడై కలయెత్తెను. ఎదుట కంటకాకీర్ణ మగు బదరీ(రేగు)వృక్షము కనుపించెను. హృదయమున వికాస తరంగ ముదయించెను. భక్తిభావము చెలరేగెను. ఆతడా రేగి చెట్టునుండి రెండు ముండ్లను త్రుంచి తెచ్చెను. ఇంతలోనే గృహస్థుని ధర్మపత్నికూడ వచ్చెను. బిల్వమంగళు డొక్కపరి యామెను జూచి తన్ను దా ధిక్కరించుకొనెను. "అభాగ్య నేత్రములారా! మీరు లేకున్న నేను నేడింత పతితుడను గాను." మీ రెంతటి దుర్మార్గమాచరించుచుంటిరి. ఇట్లు పలుకుచు, యా బిల్వమంగళుడా చంచలనేత్రములకు దండన విధించుట యుక్తమని తలంచి, యా కంటకముల రెంటిచే తన రెండు నేత్రములను భగ్న మొనర్చుకొనెను. చక్షువుల నుండి రుధిర ధారలు ప్రవహించు చుండెను. బిల్వమంగళు డానందోద్రేకమున నవ్వుచు నర్తించుచు గురుగంభీర స్వనమున హరినామ కీర్తన గావింప దొడగెను.

"శ్రీకృష్ణ గోవింద హరే మురారే! హే నాథ నారాయణ వాసుదేవ!
జిహ్వే పిబస్వామృత మేత దేవ, గోవింద దామోదర మాధవేతి."

గృహమేధి మరియు నాతని ధర్మపత్నియు మిగుల దుఃఖించిరి. కాని వారు నిరుపాయులుగదా! బిల్వమంగళుని మనోమాలిన్య మంతయు నశించెను.

దీనజనావనతత్పరుడగు నా శ్యామసుందరుని దర్శించుట కాతని చిత్తము వ్యాకుల పడసాగెను. ఇది యాతని జీవన నాటకరంగమున మూడవ యవనికా పరివర్తనము.

బిల్వమంగళునకు శ్యామసుందర చరణారవిందము లందలి భక్తి ప్రగాఢ మయ్యెను. ప్రభు వియోగ మాతనికి దుస్సహ మయ్యెను. భగ్న చక్షువులనుండి అశ్రుధార లనవరతము ప్రవహించు చుండెను. ఆకలి దప్పులు, జాగ్రత్సుషుప్తులు నాతనికి నశించెను. పల్లెలు, వనములు బిల్వమంగళుని హరి నామ కీర్తనచే ప్రతిధ్వనించి పోవుచుండెను. శ్యామసుందర చరణారవింద సందర్శనమునకై యాతడు చక్షుః హీను డయ్యెను. సర్వ సుఖములను, భోగములను బరిత్యజించెను. అట్టియెడ నింకను నా మహామాయావి లభించుట కాలసించిన యాతడు సహించ లేకుండెను. కాని సత్యయుక్తుడగు భక్తుడు ప్రేమాస్పదుని విరహమున జీవించి యున్నంతవరకు నేడ్చును. హిమవన్నగమువలె దుర్లంఘ్యము లగు నాపదలను తరించును. కాని ప్రియతముని యందు దోషారోపణ చేయడు. అతనికి తనప్రభువు యందెన్నడును దోషమే కానుపించదు. ఇట్టి ప్రేమికుడగు భక్తుని విషయమై యాప్రేమాస్పదుడగు భగవం

తుడు గూడ నుపేక్షను వహింప జాలడు. ఆత డడుగులు దడబడ బరువిడి వచ్చును. శ్రీకృష్ణ ప్రేమోన్మత్తుడగు బిల్వమంగళు డున్మత్తునివలె సర్వత్ర పరిభ్రమించు చుండెను. ఒకచో పడును. వేరొకచో నేవృక్షమునకో డీకొనును. ఇంకొకచోట సుతీక్ష్ణములగు కంటకములం దడుగిడి యుచ్చస్వరమున కృష్ణా! కృష్ణా! యనును. ఆకలిదప్పుల మాటయే లేదు. ఇట్టి స్థితియందు ప్రేమపరిపూర్ణు డగు కృష్ణు డెటుల నిశ్చింతుడై యుండును. ఒక్క దినమున నాతడు సుందర గోపబాలక వేషమును ధరించి బిల్వమంగళుని సమీపించి వీణావినిందిత స్వరముతో స్వామీ! "తామెవరు? మీకు చాల నాకలి వేయుచున్నట్లుది. నేను కొంచె మాహారమును దెచ్చితిని. మీరు దీనిని స్వీకరింపుడు." అని పలికెను.

ఆ మనోమోహక సుమధుర స్వరము బిల్వమంగళుని చిత్తము నాకర్షించెను. ఆత డామహాయోగి దుర్లభమగు పరమ పవిత్ర ప్రసాదమును గ్రహించి హర్ష పులకిత గాత్రుడయ్యెను. హృదయ మానంద పరిప్లావిత మయ్యెను. హర్ష సింధు వుద్బుద్ధమై యుత్తాల తరంగాకుల మయ్యెను. గద్గదికతో నా భక్తాగ్రగణ్యు డాబాలుని సోదరా! "నీ పేరేమి? నీ నివాస మెచ్చట? నీవేమి చేయుచుందు" వని యాతురతతో బ్రశ్నించెను. ఆ మాయా వేషధారియగు బాలుడు "నా యిల్లిచ్చటనే. నా కొక పేరని నియమము లేదు. నన్నెవ్వ రెట్లు బిలచిన నే నట్లు పలుకుచుందును. నన్నెవ్వరైన ప్రేమించిన [illegible]

వారిని ప్రేమింతును" అని చెప్పెను. బిల్వమంగళు డా బాలుని మధుర వాక్యములను విని ముగ్ధు డయ్యెను. శ్రీకృష్ణుడిచ్చిన ప్రసాదమును ఆనందముతో నాస్వాదించెను. ఆత డింద్రియా తీతమగు నానందము నొందెను. అట్టి స్థితియం దాత డెంత వరకు నుండెనో యాతనికే దెలియదు మరలిచనుచు నా సుం దర గోపబాలుడు నేను ప్రతిదినము వచ్చి నీకు భోజనము పెట్టి చనుచుందు నని చెప్పెను. బిల్వమంగళుడును మంచిది, రోజును వచ్చుచుండు మని పలికెను. గోపకుమారుని ఆ మాటలయందేమి మాధుర్యము గలదో గాని బిల్వమంగళుని మనస్సుగూడ అవశమై నాతని వెంట నంటెను. ఇక నాటి నుండి సర్వకాల సర్వావస్థల యందును. ఈ విధముగ పలుక జొచ్చెను.

" గోవింద ! గోవింద ! హరే ! మురారే !
గోవింద ! గోవింద ! ముకుంద ! కృష్ణ !
గోవింద ! గోవింద ! రథాంగపాణే !
గోవింద ! దామోదర ! మాధవేతి. "

స్వాదిష్టములగు వివిధ భోగముల నర్పించియు నెవ్వని కృపాకటాక్ష లేశమునుగూడ పొందుటకు జనులు తల్లడిల్లు చుందురో యా కృపాసింధువు, బిల్వమంగళునకు ప్రతిదినము తన యరుణారుణ కమలసన్నిభ పాణిద్వంద్వముతో యాహార మిడుచుండెను. భక్తునికై భగవంతు డేమి చేయ నొల్లడు ?

బిల్వమంగళునకు తా నెవ్వనికై సర్వసంగ పరిత్యాగము గావించెనో, మరియు నేత్రహీను డయ్యెనో, ఆత డీబాలుడే నని తెలియదు. కాని యాగోపబాలుని సుమధుర వాక్యము లాతని హృదయమును ముగ్ధ మొనర్చి వశము జేసుకొనెను. అందుచే బిల్వమంగళున కన్యుల వాక్యములను వినుటయన్న పూర్ణముగ నసహ్య మయ్యెను.

బిల్వమంగళు డొకనాడు తనలో తా నిట్లు తలచెను. "ఆపదలన్నిటిని గడచి సర్వమును బరిత్యజించి నే నీస్థితి నందగలిగితిని. కాని స్త్రీ వ్యామోహము నుండి విడువడితి నను కొంటిని. కాని మరల నేనీగోపబాలకుని మోహమున జిక్కు కొంటి" నని భావించుచుండగనే యాపరమ సుందరరసిక శేఖరుడగు బాలు డాతని వద్ద కేతెంచి సుమధుర స్వరముతో నున్మత్తుని గావించుచు స్వామీ! ఏమిటి! ఆలోచించుచుంటిరి. నేడు నేను బృందావనమున కేగుచుంటిని. మీరు కూడ వచ్చెదరా? యని ప్రశ్నించెను. బృందావనమను పేరు వినగనే బిల్వమంగళుని హృదయ మానంద రసప్లావిత మయ్యెను. కాని యాతడు తన యసమర్థత్వమును ప్రకటించుచు "నాయనా! నే నంధుడను. బృందావనమున కెట్లు పోగలను"? అని యనెను. అంత నా బాలుడు "చూడు ఇదుగో నాకర్ర నీవు దీనిని బట్టుకొనుము, నేను నిన్ను బృందావనమునకు గొంపోదును." అని చెప్పెను. బిల్వమంగళుడు హృష్టచిత్తు డయ్యెను. కృష్ణుడు తన మురళిని బిల్వమంగళునకుకిచ్చి తాను

కూడ బట్టుకొని, భక్తునకు ముందు నడువసాగెను. ఆహా! ఆత డెంతటికృపామయుడు! భక్తుని కర్రను బట్టుకొని మార్గమును జూపుచు తీసికొని వెళ్ళుచుండెను. భక్తులయెడ యెంత ప్రేమ గలవాడో కదా?

"అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితో హిసః॥ గీత

ఎంతటి దురాచారము గలవాడయినను ఇతరమును భజింపక నన్నే భజించుచుండునో ఆత డుత్తము డనియె యెంచవలెను. అతడు పరమేశ్వరుని సేవించుటచేతనే ధన్యు డ నగుదు నను నిశ్చయము గలవాడుగదా!

కొంచెము దూరము పోయిన మీదట బాలు 'ఇదిగో, బృందావనమునకు వచ్చితిమి, నే నింక పోవుచుంటి' నసెను. బిల్వమంగళుడును కర్రను వీడి బాలుని హస్తమును బట్టు కొనెను. హస్తస్పర్శమువలన శరీరమునం దంతట విద్యుత్తు ప్రవహించినటు లయ్యెను. సాత్త్విక ప్రకాశమువలన ద్వారము లన్నియు సుముక్తము లయ్యెను. బిల్వమంగళుడు దివ్యదృష్టి నొందెను. బాలక రూపమున శ్యామసుందరు డెదుట నుండుట నాతడు గాంచెను. బిల్వమంగళుని శరీరము రోమాంచిత మయ్యెను. నేత్రము లానందాశ్రు పూరితము లయ్యెను. భగవంతుని హస్తము నాతఁ డింకను గట్టిగ బట్టుకొని "ఇప్పుడు గుర్తించితిని. చాలదినములనుండి నే బట్టుకొన గల్గితిని.

ప్రభూ! ఇక నేను నిన్ను వదలను." అని యనెను. శ్యామ సుందరుడు "వదలుము. నాచేయి వదలుము." అనెను. బిల్వ మంగళుడు "కాదు కాదు. ఎన్నటికిని కాదు. త్రికాలము లందును నేను నిన్ను విడను" అని సమాధానము చెప్పెను.

అంత నా శ్యామసుందరుడు గట్టిగ విదలించి చేతిని విడిపించు కొనెను. ఎవ్వని బలమున బలముగలదై మాయ సర్వజగత్తును పదదలితము గావించి లయించెనో అట్టి మహా బలుని ఎదుట నంధు డేమి చేయగలడు? కాని యాత డాశ్యామ సుందరుని బలీయమగు భక్తిరజ్జువుచే హృదయమున బంధిం చెను. ఆరజ్జువునుండి విడివడుట యాతనికి గూడ నసాధ్యమే. చేతినివిడపించుకొనిమందహాసముతో నాలుచూపులచూచుచు, నేగుచున్న శ్రీకృష్ణునిగూర్చి బిల్వమంగళు డిట్లనెను. "పోవు చుంటివా? కృష్ణా! కృష్ణా! కాని జ్ఞప్తియం దుంచుకొనుము-

"హస్తమాక్షిప్య యాతోఽసి బలాత్ కృష్ణ! కిమద్భుతమ్
హృదయా ద్యది నిర్యాసి పౌరుషం గణయామితే॥"

చేయి విదలించుకొని పోవుటలో నాశ్చర్య మేమున్నది? నాహృదయమునుండి కదలుము. నీపౌరుషము తెలియును.

భగవంతు డాతనివీడిపోలేక పోయెను. ఆతడున్యాయముగ

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" భ గీ.4-11

"నన్నెవ్వ రెటుల సేవించిన నేనుగూడ వారి నటులే సేవింతును." అని ప్రతిజ్ఞచేసి యుండ నెట్లు పోగలుగును.

శ్యామసుందరుడు బిల్వమంగళుని సమీపించి, యాతని నేత్రములను తన కోమల కరకమలములతో నొక్కసారి స్పృశించెను. బిల్వమంగళుని నేత్రములు సాటిలేని ప్రభా సమన్వితము లయ్యెను. నేత్రములతో ప్రత్యక్షముగ భగవంతుని యతులనీయ రూపరాశిని దర్శించి, యాతడు ప్రభు చరణములకు సాగిలి మ్రొక్కి, యానందాశ్రుపూరములతో, నాపావన చరణకమలయుగళమును కడిగెను. భగవంతుడు భక్తికి వశ్యుడు. భక్తుడు భక్తిని పట్టుకొనిన భగవత్సాక్షాత్కారమును పొందును. భగవంతునకు భక్తియె ప్రధానము గాని, భక్తిగల వాడెట్టివాడు, అను విచక్షణ యవసరములేదు.

భగవంతు డాతని లేవనెత్తి కౌగలించుకొనెను. భగవంతుడు భక్తుడు వీరిర్వురి సుమధుర సమ్మేళనమున జగమంతయు మధుర భావ పూరిత మయ్యెను. దేవతలు పుష్పవృష్టిని వర్షించిరి. భక్తుడు భగవంతుడు ధన్యులైరి. వేశ్యయగు చింతామణి, గృహస్థు మరియు నాతని ధర్మపత్నియు దైవ యోగమున నచ్చటకు, వచ్చిరి. భక్తుని ప్రభావమున భగవంతుడు వారందరకు తనదివ్యదర్శనము నొసంగి కృతార్థుల జేసెను.

బిల్వమంగళుడు తన జీవిత శేషమునంతను భక్తి ప్రచారము భగవద్గుణ కీర్తనము జేయుచు గడపి యంతమున గోలోక ధామము నందెను.

—

श्रीराधेश्याम



वन्देऽमन्दविभाविभासितभुवं राधामुकुन्दद्वयीम् ।

ఓమ్

# శ్రీ గోవింద దామోదర స్తోత్రము

అగ్రే కురూణా మథ పాండవానాం
దుశ్శాసనేనాహృత వస్త్ర కేశా,
కృష్ణా తదాక్రోశ దనన్యనాథా
గోవింద! దామోదర! మాధవేతి. ౧

భీష్ముడు, ద్రోణుడు మొదలగు కౌరవులయు, ధర్మరాజు మొదలయిన పాండవులయు సమక్షమున దుశ్శాసనుడు ద్రౌపది కేశముల బట్టి, వలువ లొలువగా, దిక్కులేనిదై పాంచాలి కరముల మోడ్చి, గోవింద, దామోదర, మాధవా యని యాక్రందనము చేయుచు ప్రార్థించెను. శ్రీకృష్ణుడు వస్త్రప్రదానముచే పాంచాలిని రక్షించెను. ఈస్తోత్ర మంతయు నార్తితో భక్తులు కృష్ణ, గోవింద, దామోదర యని పిలచిన భగవంతుడు తప్పక రక్షించును — ఈ స్తోత్రమున భక్తి భావములన్నియు నిగూఢముగ వర్ణింపబడినవి. నవవిధ భక్తులు రసములు వివిధభావములు గలవు. అటుచు యీస్తోత్ర మంతట స్మరణభక్తి కీర్తనభక్తి వర్ణింపబడినది.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

ఇతర చింతన లేకుండగ నెవరు నన్ను సేవించుదురో అట్టివారి యోగక్షేమములను నేనుచూచెదనని భగవంతుని ప్రతిజ్ఞ. ఈ శ్లోకమున ద్రౌపది పాభిమానము ఆత్మాభిము గూడ విడచి సర్వాత్మ భావనతో శ్రీకృష్ణుని ధ్యానించి నట్లు వ్యక్తము.

బిల్వమంగళుడు బృందావనమున కరుగు సమయమున ఈ గోవిందదామోదర స్తోత్రము పలికెను.

శ్రీకృష్ణ! విష్ణో! మధుకైటభారే
భక్తానుకంపిన్! భగవన్! మురారే!
త్రాయస్వ మాం కేశవ! లోకనాథ!
గోవింద! దామోదర! మాధవేతి. ౨

ఓ శ్రీకృష్ణా! విష్ణో! మధుకైటభులను ద్రుంచినవాడా! భక్తులయందు దయగలవాడా! మురారే! కేశవ! లోకేశ్వరా! గోవింద! దామోదర! మాధవా! నన్ను రక్షింపుము.

విక్రేతుకామా కిల గోపకన్యా
మురారి పాదార్పిత చిత్తవృత్తిః
దద్యాదికం మోహవశా దవోచత్
గోవింద! దామోదర! మాధవేతి. 3

ఒకగోపిక పెరుగు పాలమ్ముచు మురారి శ్రీపాదార విందములయందే మనస్సు సమర్పించి యుండుటచే వివశయై "పెరుగు, పాలు" అని కేకవేయుటకు బదులు, ప్రేమవశమున

"ఓ గోవింద! మాధవ!" యనుచు నటించెను— తామున్న స్థితిని మరచి విహ్వాలచిత్తముతో భగవంతుని కీర్తించు చుండిరి. ఇట తన్మయత్వము సూచితము.

ఉలూఖలే సంభృత తండులాంశ్చ
సంఘట్టయంత్యో ముసలైః ప్రముగ్ధాః,
గాయంతి గోప్యో జనితానురాగాః
గోవింద! దామోదర! మాధవేతి. ౪

రోటిలో బియ్యమును పోసి, రోకళ్ళతో దంపుచు శ్రీకృష్ణునియం దనురాగము గలవారలై, గోపాంగనలందరు గోవింద! దామోదర! మాధవ! యని గానము చేయుచుండిరి.

కాచిత్కరాంభోజపుటే నిషణ్ణం
క్రీడాశుకం కింశుకరక్త తుండం
అధ్యాపయామాస సరోరుహాక్షీ
గోవింద! దామోదర! మాధవేతి. ౫

కమలములవంటి నేత్రములుగల యొక గోపబాలిక మోదుగు పూవువంటి నెఱ్ఱని ముక్కుగల చిలుకను కరకమలమున నుంచుకొని, గోవింద! దామోదర! మాధవ! అని దానికి నేర్పుచున్నది.

గృహేగృహే గోపవధూసమూహాః
ప్రతిక్షణం పింజర శారికాణాం,

స్ఖలద్గిరం వాచయితుం ప్రవృత్తో
గోవింద! దామోదర! మాధవేతి. ౬

బృందావనమున ప్రతిగృహమునందు గోపికలు పంజరములందలి గోరువంకలకు గోవింద! దామోదర! మాధవ! యను నామములను ప్రతిక్షణము తొట్రుపాటుతో పలికించుచుండిరి.

పర్యంకికాభాజ మలం కుమారం
ప్రస్వాపయంత్యోఽఖిల గోపకన్యాః
జగుః ప్రబంధం స్వరతాలబంధం
గోవింద! దామోదర! మాధవేతి. ౭

ఉయ్యాలలోనున్న శిశువైన బిడ్డలనుంచి, నిదురపుచ్చుచు గోపకన్యక లందరు స్వరతాళములతో మేళవించి, గోవింద! దామోదర! మాధవ! అని కమ్మని జోల పాడుచుండిరి.

రామానుజం వీక్షణ కేళిలోలం
గోపీ గృహీత్వా నవనీతగోలం
ఆబాలకం బాలక మాజుహావ
గోవింద! దామోదర! మాధవేతి. ౮

గోపబాలకులతో దాగుడు మూతలు ఆడుచున్న బలరాముని తమ్ముడగు శ్రీకృష్ణుని, యశోదాదేవి యొక్క చేతిలో వెన్నముద్ద నుంచుకొని, గోవింద! దామోదర! మాధవ! యని పిలచెను.

విచిత్రవర్ణాభరణాభిరామా
తనోతు వక్త్రాంబుజ రాజహంసీ
సదా మదీయే రసనాగ్రరంగే
గోవింద! దామోదర! మాధవేతి. ౯

నా నాలుకయనెడి నాట్యరంగమున ముఖమనెడి పద్మమునకు రాజహంసియైనదియు, విచిత్రవర్ణము లనెడి యాభరణములచేత మనోహరమైన గోవింద! దామోదర! మాధవ! యను భగవన్నామములు నాట్యమాడుగాక!.

అంకాధిరూఢం శిశుగోపరూపం
స్తనం ధయంతం కమలైకకాంతం,
సంబోధయామాస ముదా యశోదా
గోవింద! దామోదర! మాధవేతి. ౧౦

ఒడిలోనుండి పాలుద్రాగుచున్న బాలగోపాలరూపధారియగు లక్ష్మీకాంతునిజూచి, యశోదాదేవి ప్రేమానందమున మునిగి, గోవింద! దామోదర! మాధవ! యని లాలించుచున్నది.

క్రీడంత మంతర్వ్రజ మాత్మజం స్వం
సమం వయస్యైః పశుపాల బాలైః,
ప్రేమ్ణా యశోదా సముదాజుహావ
గోవింద! దామోదర! మాధవేతి. ౧౧

తనయింటను గోపబాలురతో గూడి గోశాలయం దాడు చున్న ముద్దుబాలుడగు శ్రీకృష్ణుని యశోద యత్యంత ప్రేమతో గోవిందా! దామోదరా! మాధవా! యని పిలచెను.

యశోదయా గాఢములూఖలేన
గోకంఠపాశేన నిబధ్యమానః,
రురోద మందం నవనీతభోజీ!
గోవింద! దామోదర! మాధవేతి. ౧౨

కృష్ణుడుచేయు కొంటెపనులకు విసిగి తల్లియగు యశోద పలువుతో గట్టిగా ఱోటికి శ్రీకృష్ణుని కట్టివేసెను. అప్పుడు కొంచెకొంచెముగ వెన్నతినుచు లోలోన మెల్లగ వెక్కి వెక్కి గోవింద! దామోదర! మాధవ! యనుచు నేడ్చెను.

నిజాంగణే కంకణ కేళిలోలం
గోపీగృహీత్వా నవనీతగోలం
ఆమర్దయ త్పాణితలేన నేత్రే
గోవింద! దామోదర! మాధవేతి. ౧౩

నందనందనుడు తనయింటిముంగిట కడియముతో నాడుకొనుచుండగ యశోద యొకచేతిలో వెన్నముద్ద నుంచు కొని, రెండవ చేతితో తనరెండుకన్నులు మూసికొని ప్రేమ

పూర్వకముగ గోవింద ! దామోదర ! మాధవ ! ఇదిగో వెన్న అని యుచ్చరించుచు పిలుచుచుండెను.

గృహేగృహే గోపవధూసమూహాః
సర్వేఽపినిత్యా సమవాయయోగే,
పుణ్యాని నామాని పఠంతినిత్యం
గోవింద! దామోదర! మాధవేతి. ౧౪

వ్రేపల్లెయందు ప్రతిగృహమున గోపిక లొకచోట జేర తటస్థించిన వారందరు కలసి గోవింద ! దామోదర ! మాధవ ! యను పవిత్రనామములను నిత్యము గానము చేయుచుందురు. ఇందు కీర్తనభక్తి వ్యక్తమగుచున్నది. అందరు ఒకచోటకలిసి తన్మయులై భగవంతుని కీర్తించు చుండిరి.

మందారమూలే మదనాభిరామం
స్మరేత్ సదా పూరితవేణునాదం
గోగోప గోపీజనమధ్యసంస్థితం
గోవింద! దామోదర! మాధవేతి. ౧౫

కల్పవృక్షము మొదట మన్మథునివలె మనోహరుడై సదా మురళిని యూదుచు గోవులయు, గోపకులయు, గోపికలయు నడుమనున్న శ్రీకృష్ణుని గోవింద ! దామోదర ! మాధవ! యని సదా స్మరింపవలయును.

ఉత్థాయ గోప్యో పరరాత్రిభాగే
స్మృత్వా యశోదాసుతబాలకేలిం
గాయంతి ప్రోచ్చై ర్దధి మంథయంత్యో
గోవింద! దామోదర! మాధవేతి. ౧౬

గోపికలు బ్రాహ్మీముహూర్తమున (తెల్లవారుజామున గం॥ 4-0) లేచి యశోదపుత్రు డగు శ్రీకృష్ణుని స్మరించి, పెరుగు చిలుకుచు గోవింద! దామోదర! మాధవ! యని బిగ్గఱగ పాడుచుండిరి.

జగ్ధోథదత్తో నవనీతపిండో
గృహే యశోదా విచికిత్సయంతీ,
ఉవాచ " సత్యంవద హేమురారే "
గోవింద! దామోదర! మాధవేతి. ౧౭

ఒకనాడు బాలకృష్ణుడు తల్లిలేకుండుటజూచి వెన్న దొంగిలించి, తానుభక్షించి, చెలికాండ్రకు బెట్టెను. పిమ్మట యశోద వచ్చి, వెన్నలేకుండుట గాంచి ఓరీ మురారీ! గోవిందా! దామోదర! మాధవ! యని బెదరించి పలికెను.

అభ్యర్చ్య గేహం యువతిః ప్రవృద్ధ
ప్రేమప్రవాహా దధి నిర్మమంథ
గాయంతి గోప్యోఽథ సఖీసమేతా
గోవింద! దామోదర! మాధవేతి. ౧౮

యశోద ప్రాతఃకాలమున లేచి గృహము పరిశుభ్ర పరచి, రంగవల్లు లలంకరించి, హృదయమున పొంగి పొరలి వచ్చు ప్రేమ ప్రవాహముకలదై పెరుగు చిలుకుచుండ సఖులతో గోపికలు గోవింద! దామోదర! మాధవ! యని మధురముగ పాడిరి.

క్వచిత్ ప్రభాతే దధిపూర్ణపాత్రే
నిక్షిప్య మంథం యువతీ ముకుందం,
ఆలోక్య గానం వివిధం కరోతి
గోవింద! దామోదర! మాధవేతి. ౧౯

ఒకనాటి యుదయమున నిండుపెరుగు భాండమున గవ్వముపెట్టి, నిదురనుండి యప్పుడే మేల్కాంచి, పడకమీద కూర్చొనియున్న బాలకృష్ణుని జూచి యశోద ప్రేమవిహ్వలయై గోవింద! దామోదర! మాధవ! యని పలువిధముల పాడెను.

క్రీడాపరం భోజన మజ్జనార్థం
హితైషిణీ స్త్రీ తనుజం యశోదా,
ఆజూహవత్ ప్రేమపరిప్లుతాక్షీ
గోవింద! దామోదర! మాధవేతి. ౨౦

ఆటలుమరగి యాహారపానీయముల కెంతసేపటికి రాని పుత్రుని హితముగోరి, యశోద ప్రేమపూర్ణములగు చూపు

లతో ఓరీ గోవిందా! నాతండ్రీ! దామోదర! మాధవ! నీళ్లు పోసుకొని, అన్నము తినిపోయి, యాడుకొందువుగాని రారా యని పిలచెను.

సుఖం శయానం నిలయే చ విష్ణుం
దేవర్షి ముఖ్యా మునయః ప్రపన్నాః,
ప్రార్థ్యా చ్యుతం తన్మయతాం వ్రజంతి
గోవింద! దామోదర! మాధవేతి. ౨౧

దేవర్షియగు నారదుడు, ప్రసన్నులైన మునులు, గృహమున సుఖముగ శయనించి యుండిన విశ్వవ్యాపకుడగు శ్రీకృష్ణుని గోవింద! దామోదర! మాధవ! యనుచు ప్రార్థించుచు తన్మయత్వమును జెందెను.

విహాయ నిద్రా మరుణోదయే చ
విధాయ కృత్యాని చ విప్రముఖ్యాః,
వేదావసానే ప్రపఠంతి నిత్యం
గోవింద! దామోదర! మాధవేతి. ౨౨

వేదవేత్తలగు విప్రవరు లరుణోదయమున మేల్కొని కార్యముల తీర్చికొని, వేదపాఠములు చేసినపిమ్మట నిత్యము గోవింద! దామోదర! మాధవ! యని ప్రేమతో పఠించెదరు. — వేదాధ్యయనమున కాద్యంతములయందు భగవన్నామమె ప్రార్థన, శాంతులు. అనగా సర్వ వేద సారము భగవన్నామ మని నిశ్చయము.

బృందావనే గోపగణాశ్చ గోప్యో
విలోక్య గోవిందవియోగఖిన్నాం,
రాధాం జగుః సాశ్రువిలోచనాభ్యాం
గోవింద! దామోదర! మాధవేతి. ౨౩

బృందావన మండలి గోపకులు గోపికలు శ్రీకృష్ణుని యెడబాసి దుఃఖించుచున్న రాధను చూచి కన్నీరుమున్నీరుగా గార్చుచు, గోవింద! దామోదర! మాధవ! యని పిలచిరి.

ప్రభాతసంచారగతానుగావ
స్తద్రక్షణార్థం తనయం యశోదా,
ప్రాబోధయత్ పాణితలేన మందం
గోవింద! దామోదర! మాధవేతి. ౨౪

సూర్యోదయమైనది. ఆవులమేపులకు బోయినవి, శ్రీకృష్ణు డింకను నిదురనుండి లేవలేదు. అపుడుయశోద యఱచేతితో మెల్లగా తట్టుచు గోవిందా! దామోదరా! మాధవా! యనుచు మేల్కొలిపెను.

ఈ శ్లోకమువరకు గల శ్లోకము లన్నిటియందు క్రమముగ లేకున్నను, సామాన్యముగ కృష్ణు డుదయమున లేచినది మొదలు సాయంత్ర మిల్లుచేరి నిద్రించువరకు గల యాతని లీలావినోదములు గోపకులు గోపికలు గోపబాలురు వ్రజపుర మండలి యితరదృశ్యములు వర్ణింప బడినవి. — దీనిని బట్టి మహాభక్తు డగు . బిల్వమంగళుడు సర్వకాల సర్వావస్థలయం

దును ఆ శ్రీకృష్ణచంద్రుని భక్తజన హృదయాకర్షకము లగు లీలలనే గాంచుచుండిన పరమ భాగవతోత్తము డని విశద మగు చున్నది.

ప్రవాలశోభా ఇవ దీర్ఘ కేశా
వాతాంబుపర్ణాశన పూతదేహాః,
మూలేతరూణాం మునయః పఠంతి
గోవింద ! దామోదర ! మాధవేతి. ౨౫

పగడములవలె నెఱ్ఱనైన దీర్ఘకేశములు గలిగి, గాలి, నీరు, ఆకులు దిని పవిత్రదేహములుగల మునులు, వృక్ష మూలమున విశ్రాంతిగ కూర్చుండి గోవింద ! దామోదర ! మాధవ ! యని పఠించుచుందురు. కఠోరమగు తపోనియమ ములచే ఋషులు నిత్యము చేయు తప మీ భగవన్నామమె.

ఏవం బ్రువాణా విరహాతురా భృశం
వ్రజస్త్రియః కృష్ణవిషక్త మానసాః
విసృజ్య లజ్జాం రురుదుస్మ సుస్వరం
గోవింద ! దామోదర ! మాధవేతి. ౨౬

శ్రీకృష్ణవిరహముచే మిక్కిలి వేదనపాలయి వ్రజాంగ నలు శ్రావ్యములగు కంఠములతో సిగ్గువిడచి గోవింద ! దామోదర ! మాధవ ! యని పలుకుచు రోదించుచుండిరి.— పతివ్రత లగు గోపికలు సర్వులకు ప్రభువు శ్రీకృష్ణు డొక్కడె

యను భావము వ్యక్తమగునట్లు, ముక్తకంఠములతో శ్రావ్యముగ శ్రీకృష్ణనామమును గానము చేయుచుండిరి.

గోపీ కదాచి న్మణిపంజరస్థం
శుకం వచో వాచయితుం ప్రవృత్తా,
ఆనందకంద! వ్రజచంద్ర! కృష్ణ!
గోవింద! దామోదర! మాధవేతి. ౨౭

ఒకనా డొక గోపిక మణిపంజరమున నున్న కీరమునకు ఆనందకంద! వ్రజచంద్ర! కృష్ణ! గోవింద! దామోదర! యను మాటలను నేర్పఁజొచ్చెను.

గోవత్స వాలైః శిశుకాకపక్షం
బధ్నంత మంభోజదళాయతాక్షం,
ఉవాచ మాతా చిబుకం గృహీత్వా
గోవింద! దామోదర! మాధవేతి. ౨౮

లేగతోకకు గొల్లపిల్లవాని జుట్టునకు ముడివేయుచున్న పద్మదళములవంటి నేత్రములు గల శ్రీకృష్ణుని తల్లిజూచి గడ్డము పట్టుకొని నాయనా! గోవిందా! దామోదరా! మాధవా! ఇదేమిపనిరా! యని మందలించెను.

ప్రభాతకాలే వరవల్లవౌఘా
గోరక్షణార్థం ధృతవేత్రదండాః,
ఆకారయామాసు రనంతమాద్యం
గోవింద! దామోదర! మాధవేతి. ౨౯

ఉదయము గొల్లపిల్లలు కొరడాలను చేబూని పశువు లను గాచుటకు, అనంతుడు, అనాదిపురుషుడు నగు శ్రీకృష్ణుని గోవింద! దామోదర! మాధవ! యని పిలచిరి.

జలాశయే కాళియ మర్దనాయ
యదా కదంబా దపతన్మురారిః,
గోపాంగనా శ్చుక్రుశు రేత్య గోపా
గోవింద! దామోదర! మాధవేతి. 30

యమునాహ్రదమున నున్న కాళీయుడను పామును మర్దించుటకు కడిమిచెట్టుపైనుండి మడుగులోనికి దుమికిన మురారిని సమీపించి గోపికలు, గోపకులు దుఃఖమున గోవింద! దామోదర! మాధవ! యని విలపించిరి.

అక్రూర మాసాద్య యదా ముకుంద
శ్చాపోత్సవార్థం మధురాం ప్రవిష్టః
తదా సపౌరై ర్జయతీ త్యభాషి
గోవింద! దామోదర! మాధవేతి. 31

కంసుడు చేయు ధనుర్యాగమును జూచుటకు ముకుం దుండ క్రూరునితో మధురాపట్టణములో ప్రవేశించినపుడు పుర వాసులు గోవింద! దామోదర! మాధవ! యని జయజయ ధ్వనులు చేసిరి.

కంసస్య దూతేన యదైవనీతౌ
బృందావనాంతా ద్వసుదేవసూనూ
రురోద గోపీ భవనస్య మధ్యే
గోవింద! దామోదర! మాధవేతి. 32

కంసుని దూతయగు యక్రూరుడు బృందావనము నుండి శ్రీకృష్ణుని బలరాముని మధురకు దీసికొనిపోవునపుడు యశోద గృహమున గూర్చుండి వాత్సల్యమున హా గోవింద! దామోదర! మాధవా! యని యేడ్చెను.

సరోవరే కాళియనాగబద్ధం
శిశుం యశోదా తనయం నిశమ్య,
చక్రు ర్లుఠంత్యః పథి గోపబాలా
గోవింద! దామోదర! మాధవేతి. 33

కాళిందిమడుగులో కాళియు డను పాము పసిబాలుడైన యశోదాకుమారుడగు కృష్ణుని చుట్టి బంధింపగ, చూచి నేలమీదపడి పొరలుచు గోపబాలురు గోవింద! దామోదర! మాధవ! యనుచు నేడ్చిరి.

ఇచ్చట కృష్ణుని కాళియుడు బట్టుకొని యుండగా గోపబాలురు "గోవింద! దామోదర! మాధవ!" యనిపిలుచుచు నేడ్చుచున్నటుల వర్ణింపబడెను. కృష్ణుడు కాళియ నిబద్ధుడై యుండ నాతనికి గలిగిన యాపదను బాపుట కితరులను బిలువవలెను గాని యాతనినే బిలచిన నేమి ప్రయోజనము? కాని

ఇచ్చట భావ మదికాదు. "సర్వశక్తిమంతు డీశ్వరు డొక్కడే, మనమందరము నిమిత్తమాత్రులము, సర్వమాతని యిచ్ఛానుసారమే జరుగుచుండును, మనుజుడు సర్వమును దానే సంపన్న మొనరించుచుంటి ననీ భావించుట పొరబాటు" అను నీవిధ మగు సర్వసమర్పణ భావము గల బిల్వమంగళుని భక్తిభరిత హృదయము నీ శ్లోకము ప్రస్ఫుటిత మొనరించు చున్నది.

అక్రూరయానే యదువంశనాథం
సంగచ్ఛమానం మధురాం నిరీక్ష్య,
ఊచుర్వియోగాత్ కిల గోపబాలా
గోవింద! దామోదర! మాధవేతి. 34

అక్రూరుని రథముమీద గూర్చుండి మధురకు బోవుచున్న యదుకుల తిలకుని జూచి వియోగము సహింపలేని గోపకన్నియలు గోవింద! దామోదర! మాధవ! మమ్ము విడచి యెక్కడికి వెళ్లుచుంటివి? యని పలికిరి.

చక్రంద గోపీ నలినీవనాంతే
కృష్ణేన హీనా కుసుమే శయనా,
ప్రఫుల్ల నీలోత్పలలోచనాభ్యాం
గోవింద! దామోదర! మాధవేతి. 35

శ్రీ రాధాదేవి పద్మవనమున కృష్ణుడులేని పూల పానుపున శయనించి, వికసించిన నల్లకలువలబోలు నేత్ర

ములతో గోవింద! దామోదర! మాధవ! యని రోదనము చేసెను.

మాతాపితృభ్యాం పరివార్యమాణా
గేహం ప్రవిష్టా విలలాప గోపీ,
ఆగత్యమాం పాలయ విశ్వనాథ!
గోవింద! దామోదర! మాధవేతి. 31

తలిదండ్రులు వలదని వారింపగా, రాధ ఇంటిలోనికి పోయి విశ్వనాధా! గోవింద! దామోదర! మాధవ! రమ్ము నన్ను పాలింపుము, అని విలపించు చుండెను.

బృందావనస్థం హరి మాశు బుద్ధ్వా
గోపీ గతా కాపి వనం నిశాయాం,
తత్రాప్య దృష్ట్వాతి భయాదవోచత్
గోవింద! దామోదర! మాధవేతి. 32

బృందావనమున హరి యున్నాడని తెలిసి యొకానొక గోపిక రాత్రివేళ నడవిలోనికి శీఘ్రముగ వెళ్ళి, అందు కృష్ణుని గానక మిగుల భయపడి గోవింద! దామోదర! మాధవ! యని బిగ్గరగ యరచెను.

సుఖం శయానా నిలయే నిజేఽపి
నామాని విష్ణోః ప్రవదంతి మర్త్యాః

తే నిశ్చితం తన్మయతాం వ్రజంతి
గోవింద! దామోదర! మాధవేతి. ౩౭

మానవులు తమతమ గృహములందు సుఖముగ నుండియే, విష్ణువుయొక్క గోవింద! దామోదర! మాధవ! యను నామములను స్మరించినచో వారు నిజముగ తన్మయత్వ మును జెందెదరు.

సా నీరజాక్షీ మవలోక్య రాధాం
రురోద గోవింద వియోగఖిన్నాం,
సఖీ ప్రఫుల్లోత్పలలోచనాభ్యాం
గోవింద! దామోదర! మాధవేతి. ౩౮

శ్రీకృష్ణ విరహముచే ఖిన్నురాలైన రాధను ఒక గోపిక చూచి, వికసించిన నల్లకలువవంటి నేత్రములతో కన్నీరు గార్చుచు గోవింద! దామోదర! మాధవ! యని యేడ్చెను.

జిహ్వే! రసజ్ఞే! మధురప్రియే! త్వం
సత్యం హితం త్వాం పరమం వదామి
ఆవర్ణయేథా మధురాక్షరాణి
గోవింద! దామోదర! మాధవేతి. ౪౦

ఓ నాలుకా! విను. నీవు రసమెరింగిన దానవు. మధుర మనిన నీకు మిక్కిలి యిష్టము. కావున నీకు పరమసత్యము,

హితము నైన సంగతి చెప్పుచున్నాను, వినుము. నీవు గోవింద! దామోదర! మాధవ! యను మధురాక్షరములను తలచు పల్లించుచుండుము.

ఆత్యంతికం వ్యాధిహరం జనానాం
చికిత్సకం వేదవిదో వదంతి,
సంసారతాపత్రయ నాశబీజం
గోవింద! దామోదర! మాధవేతి. ౪౧

జనులయొక్క ప్రబలమగు భవరోగమును బోగొట్టునదియు, సంసార సంబంధమైన, అధిదైవికాధ్యాత్మికాధి భౌతికము లనెడి తాపత్రయముల నశింపజేయునదియు నగు పరమౌషధము గోవింద! దామోదర! మాధవాది భగవన్నామోచ్చారణ మని వేదవేత్తలు చెప్పుదురు.

సంసార మందలి తాపత్రయములకు రహస్యమగు పరమౌషధ మిదియే. ఇతర సాధన లవసరము లేకయే కేవల భగవన్నామము చేతనే తాపత్రయ దోషము పోవునట.

తాతాజ్ఞయా గచ్ఛతి రామచంద్రే
సలక్ష్మణేఽరణ్యచయే ససీతే,
చక్రంద రామస్య నిజాజనిత్రీ
*గోవింద! దామోదర! మాధవేతి. ౪౨

* పాఠాంతరము : హే రామ ! రఘునందన ! రాఘవేతి.

తండ్రి యాజ్ఞచే లక్ష్మణునితో సీతతో నడవులకేగు శ్రీరాముని జూచి, తల్లి కౌసల్య, గోవింద! దామోదర! మాధవ! యని విలపించెను.

ఏకాకినీ దండక కాననాంతాత్
సా నీయమానా దశకంధరేణ,
సీతా తదాఽక్రంద దనన్యనాథా
*గోవింద! దామోదర! మాధవేతి. ౪౩

దండకారణ్యమున నొంటరిగా నున్నవేళ రావణుడు బలాత్కారముగా దన్ను గొనిపోవ వేఱుదిక్కులేనిదై సీత గోవింద! దామోదర! మాధవ! యని రోదన మొనరించెను.

**42, 43, 44, 45** ఈ నాలుగు శ్లోకములవలన రామ కృష్ణుల కభేదా ధ్యవసాయము నిశ్చితమగుచున్నది.

ఈ శ్లోకమున రావణునిచే బలాత్కారముగ గొని పోబడు సీత తన నాథుని సంబోధించిన సంబోధనలు "గోవింద! దామోదర! మాధవ!" యని వివరింపబడెను. ఇచట గల యీ గోవిందాది శబ్దములకు రఘుకుల చంద్రుడగు రాముడే యర్థము. ఈ గోవింద దామోదర స్తోత్రము శ్రీకృష్ణపరము. ఇందధిక శ్లోకములు శ్రీకృష్ణ స్తుతిరూపముననే యున్నవి. కాని యీ స్తోత్ర మధ్యస్థమగు నీ శ్లోకము మొదలు నాలుగు శ్లోకములవరకు ఇటకను కొన్ని శ్లోకములు రామపర మయ్యెను, శ్రీకృష్ణ కర్ణామృత కర్త యగు లీలాశుకుని

విహాయ కోదండ శరౌ ముహూర్తం
గృహాణ పాణౌ మణి చారువేణుమ్,
మాయూర బర్హంచ నిజోత్తమాంగే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్.

అను శ్లోకమును స్మరణకు దెచ్చుచున్నది. సర్వ దైవతములందు కేవల మొక్క కృష్ణునే దర్శించు బిల్వమంగలుని మహత్తర భక్తిభావము నుద్దీపింప జేయుచున్నది. తన యిష్ట దైవమునే సర్వత్ర సర్వదేవతలయందు దర్శించువాడే ధన్యుడు.

రామా ద్వియుక్తా జనకాత్మజాసా
విచింతయంతీ హృదిరామరూపం,
రురోద సీతా రఘునాథ పాహి
* గోవింద ! దామోదర ! మాధవేతి. ౪౪

శ్రీరాముని యెడబాసిన యాసీత హృదయము నందు రాముని రూపమును ధ్యానించుచు, రఘునాథ! గోవింద! దామోదర! మాధవ! పాహి పాహి (రక్షింపుము) అని యేడ్చెను.

ప్రసీద విష్ణో ! రఘువంశనాథ !
సురాసురాణాం సుఖదుఃఖహేతో !
రురోద సీతాతు సముద్ర మధ్యే
* గోవింద ! దామోదర ! మాధవేతి. ౪౫

రావణునిచే గొనిపోబడుచున్న సీత సముద్రము నడుమ ఓవిష్ణుమూర్తీ! రఘువంశనాథ! దేవతల సుఖమునకు రాక్షసుల దుఃఖమునకు కారణమైనవాఁడా! గోవింద! మాధవ! దామోదర! యని దుఃఖించెను.

అంతర్జలే గ్రాహ గృహీతపాదో
విసృష్ట విక్లిష్ట సమస్త బంధుః
తదా గజేంద్రో నితరాం జగాద
గోవింద! దామోదర! మాధవేతి. ౭౬.

గజేంద్రుఁడు నీటిలోని మొసలిచే జిక్కువడి వేయి సంవత్సరములు పోరాడెను. బల ముడిగెను. బంధువు లెల్లరు విడిచి పోయిరి. అప్పుడు దిక్కులేనిదై గోవింద! దామోదర! మాధవ! నీవే తప్ప నితః పరం బెరుగ నంచు మొఱవెట్టెను.

విజ్ఞాన విరహితమై జడబుద్ధియై మదాంధుడై యుండు గజరాజు, ఆర్తనాదము తన్నుగూర్చి "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండులీనమై......" అని వెలువడగనే ఆర్తత్రాణ పరాయణుడును, స్వభాక్తార్తి హరుండును అగు నా భగవంతుడు "సిరికిం జెప్పడు......" సర్వస్వమును వీడి, సాధన మేమియు లేకుండగనే భక్తుని పిలుపు విన్నంతనే ఏతెంచి గజేంద్రుని సంరక్షించెను. ఇచట భగవంతుని 'ఆర్త త్రాణ పరాయణత్వము వ్యక్తమగుచున్నది. బిల్వమంగళుని యీ చిన్న శ్లోకమొక్కటియే యీవిశాల చరిత్ర చిత్ర

మును దర్శింపజేసి మన మనస్సును ఆ పరమకృపామయు డగు భగవంతుని చరణసరోజ సన్నిధియందు లగ్నము గావించు చున్నది.

హంసధ్వజః శంఖయుతో దదర్శ
పుత్రం కటాహే ప్రపతంతమేనం,
పుణ్యాని నామాని హరే ర్జపంతం
గోవింద ! దామోదర ! మాధవేతి. ౪౭

పురోహితుడగు శంఖునితో గలిసి హంసధ్వజ మహా రాజు గోవింద ! దామోదర ! మాధవ ! యను పరమ పవిత్ర నామములను పఠించుచు సలసలమరుగుచున్న నూనె కాగులో పడిన తనకుమారుడగు సుధన్వుని జూచెను.

హంసధ్వజుని కుమారుడు సుధన్వుడు. పురోహి తుఁడు శంఖుఁడు. యుధిష్ఠిరుని యాగాశ్వమును హంస ధ్వజుడు పట్టుకొని కట్టివేసెను. అప్పుడు అశ్వము వెంట వచ్చిన యర్జునునకు హంసధ్వజునకు యుద్ధము జరిగెను. హంస ధ్వజుడు తనపట్టణమున యుద్ధము జేయగల పురుషు లెల్లరు యుద్ధమునకు వచ్చి తీరవలయుననియు, రానివారిని సలసల మరగు నూనెకాగులో బడవేయవలసిన దనియు యాజ్ఞ చేసెను. సుధన్వుడు యుద్ధసన్నద్ధుడై వచ్చుచు భార్యతో చెప్పివచ్చుటకు బోగా ఋతుమతియైన యాయింతి మగని తనయిష్టముదీర్పక పోరాదని నిర్బంధించి యుద్ధమునకు బోకుండ

జేసెను. ఆకారణమున నాతడు రాజదండనమునకు లోనయ్యెను. తప్త తైల కటాహమున బడియు ప్రహ్లాదనాదులయందలి శీతలత్వ మనుభవించుచు శ్రీకృష్ణునిచే రక్షింపబడెను.

దుర్వాససో వాక్య ముపేత్య కృష్ణా
సా చాబ్రవీత్ కాననవాసినీశం,
అంతః ప్రవిష్టం మనసా జుహావ
గోవింద! దామోదర! మాధవేతి. ౪౮

దుర్యోధనుని కుతంత్రమున దుర్వాసుడు పదివేలమంది శిష్యులతో వనవాసముచేయు యుధిష్ఠిరుని యొద్దకు భోజనము పెట్టింపుమని యసమయమున వచ్చి యడిగెను. అప్పుడు పరమభక్తురాలగు ద్రౌపదీదేవి తనమనస్సునం దీశ్వరుడగు శ్రీకృష్ణుని గోవింద! దామోదర! మాధవ! యని స్మరించెను.

ధ్యేయం సదా యోగిభి రప్రమేయం
చింతాహరం చింతితపారిజాతం,
కస్తూరికాకల్పిత నీలదేహం
గోవింద! దామోదర! మాధవేతి. ౪౯

దుఃఖములను హరించి కోరిన కోర్కెలొసగుట యందు కల్పవృక్షమువంటి వాడును, అప్రమేయుండును కస్తూరిచే పూయబడిన దేహము గలవాడును అగు శ్రీహరిని సదా యోగులచేత గోవింద! దామోదర! మాధవ! యని ధ్యానింప దగినవాడు.

సంసారకూపే పతితోఽత్యగాధే
మోహాంధపూర్ణే విషయాభితప్తే
కరావలంబం మమ దేహి విష్ణో!
గోవింద! దామోదర! మాధవేతి. ౫౦

అంతులేని సంసారమను మిక్కిలి లోతైన చీకటి నూతిలో విషయాదులచే నుడికిపోవుచున్న నాకు, ఓ విష్ణు మూర్తీ! గోవింద! దామోదర! మాధవ! చేయూత నొసగి రక్షింపుము.

త్వా మేవ యాచే మమ దేహి జిహ్వే!
సమాగతే దండధరే కృతాంతే,
వక్తవ్య మేవం మధురం సుభక్త్యా
గోవింద! దామోదర! మాధవేతి. ౫౧

ఓ నాలుకా! విను, నిన్నే నేను యాచించునది. యమధర్మరాజు దండధరుడై ప్రాణములు గొనిపోవ వచ్చినప్పుడు మంచి భక్తితో మధురముగా గోవింద! దామోదర! మాధవ! యని యనుము.

భజస్వ మంత్రం భవబంధ ముక్త్యై
జిహ్వే! రసజ్ఞే! సులభం మనోజ్ఞం,
ద్వైపాయనాద్యై ర్మునిభిః ప్రజప్తం
గోవింద! దామోదర! మాధవేతి. ౫౨

ఓనాలుకా! రుచు లెరిగినదానవు. సులభమైనది. మన స్సున కింపైనది. వ్యాసాది మునీంద్రులు లెస్సగా జపించినది సంసార బంధములు వీడుటకు గోవింద! దామోదర! మాధవ! యను మంత్రమును భజింపుము.

గోపాల! వంశీధర! రూపసింధో!
లోకేశ! నారాయణ! దీనబంధో!
ఉచ్చస్స్వరై స్త్వం వద సర్వదైవ
గోవింద! దామోదర! మాధవేతి. ౫౩

గోపాలకుడా! వేణువును ధరించినవాడా! సాటిలేని సౌందర్యము గలవాడా! లోకము లేలువాడా! నారాయణా! దీనబంధూ! గోవింద! దామోదర! మాధవ! యని గొం తెత్తి బిగ్గఱగా సర్వదా కీర్తింపుము.

జిహ్వే! సదైవం భజసుందరాణి
నామాని కృష్ణస్య మనోహరాణి
సమస్త భక్తార్తి వినాశనాని
గోవింద! దామోదర! మాధవేతి. ౫౪

ఓ నాలుకా! నీవెల్లప్పుడు మనోహరములగు శ్రీకృష్ణుని "గోవింద, దామోదర, మాధవ యను నామములను స్మరిం పుము" అది భక్తులందరి యార్తిని బోగొట్టును.

గోవింద ! గోవింద ! హరే ! మురారే !
గోవింద ! గోవింద ! ముకుంద ! కృష్ణ !
గోవింద ! గోవింద ! రథాంగపాణే !
గోవింద ! దామోదర ! మాధవేతి. ౫౫

ఓ నాలుకా ! గోవింద ! గోవింద ! హరే ! మురారే ! గోవింద ! గోవింద ! ముకుంద ! కృష్ణ ! గోవింద ! రథాంగ పాణే ! గోవింద ! దామోదర ! మాధవ ! యను నీ నామము లను స్మరింపుము.

సుఖావసానే త్విదమేవ సారం
దుఃఖావసానే త్విదమేవ గేయం
దేహావసానే త్విదమేవ జాప్యం
గోవింద ! దామోదర ! మాధవేతి. ౫౬

సుఖము అంతమగునపు డిది యే సారరూపము. దుఃఖ నివృత్తికి దీనినే గానము చేయవలయును. మృత్యుసమయ మున జపించుటకు యోగ్య మగు మంత్రము గూడ నిదియే. ఆమంత్రమే గోవింద ! దామోదర ! మాధవ.

సుఖావసానము దుఃఖము. దుఃఖావసానము సుఖము. ఈ రెంటికి యాధారము భగవన్నామము. కాగా సర్వకాలము లందు భగవన్నామము జపించుచుండిన నంతయు సుఖమె. ఇక దుఃఖమున కాశ్రయమె ఉండదు.

దుర్వారవాక్యం పరిగృహ్య కృష్ణా
మృగీవ భీతా తు కథం కథంచిత్
సభాం ప్రవిష్టా మనసా జుహావ
గోవింద! దామోదర! మాధవేతి. ౫౭

దుఃశాసనుని దుర్నివార్యములగు మాటలను వినుచు లేడివలె భయపడుచు ద్రౌపది ఎట్లో సభయందు ప్రవేశించి మనస్సులో గోవింద! దామోదర! మాధవ! యని భగవంతుని స్మరింపసాగెను.

శ్రీకృష్ణ! రాధావర! గోకులేశ!
గోపాల! గోవర్ధన! నాథ! విష్ణో!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౫౮

ఓనాలుకా! నీవు శ్రీకృష్ణ! రాధారమణ! వ్రజరాజ! గోపాల! గోవర్ధన! విష్ణో! గోవింద! దామోదర! మాధవ! యను నీ నామామృతమును పానము జేయుము.

ఈ శ్లోకము మొదలు గ్రంథాంతమువరకు జిహ్వేంద్రియముయొక్క సార్థక్యము వర్ణింపబడినది.

శ్రీనాథ! విశ్వేశ్వర! విశ్వమూర్తే!
శ్రీదేవకీనందన! దైత్యశత్రో!

జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౫౯

ఓ నాలుకా! నీవు శ్రీనాథ! సర్వేశ్వర! శ్రీవిష్ణు స్వరూప! శ్రీదేవకీనందన! దైత్యశత్రో! గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

గోపీపతే! కంసరిపో! ముకుంద!
లక్ష్మీపతే! కేశవ! వాసుదేవ!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౦

ఓ నాలుకా! నీవు గోపీపతే! కంసరిపో! ముకుంద! లక్ష్మీపతే! కేశవ! వాసుదేవ! గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

గోపీజనాహ్లాదకర! వ్రజేశ!
గోచారణారణ్య కృత ప్రవేశ!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౧

ఓ నాలుకా! గోపికల కానందమును గలుగ జేయు వాడును, వ్రజరాజును, గోవులను మేపుట కరణ్యమును ప్రవే

శించిన వాడు నగు ఆ మురారియొక్క గోవింద! దామోదర! మాధవ! యను నీ నామామృతమును నిరంతరము పానము జేయుము.

ప్రాణేశ ! విశ్వంభర ! కైటభారే !
వైకుంఠ ! నారాయణ ! చక్రపాణీ !
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౨

ఓ నాలుకా! నీవు ప్రాణేశ! విశ్వంభర! కైటభారే! వైకుంఠ! నారాయణ! చక్రపాణీ! గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

హరే! మురారే! మధుసూదనాద్య !
శ్రీరామ! సీతావర! రావణారే!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౩

ఓ నాలుకా! నీవు హరే! మురారే! మధుసూదన! శ్రీరామ! సీతాపతే! రావణారే! గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

శ్రీయాదవేంద్రాద్రి ! ధరాంబుజాక్ష !
గోగోప గోపీ సుఖదాన దక్ష !
జిహ్వే ! పిబ స్వామృత మేతదేవ
గోవింద ! దామోదర ! మాధవేతి. ౬౪

ఓ నాలుకా ! నీవు యదుకులనాధ ! గిరిధర ! కమల నయన ! గోవులకు గోపికలకు సుఖము నిచ్చుటయందు కుశలుడా ! శ్రీ గోవింద ! దామోదర ! మాధవ ! యను నీ నామామృతమును నిరంతరము పానము జేయుము.

ధరాభరోత్తారణ ! గోపవేష !
విహారలీలాకృత బంధుశేష !
జిహ్వే ! పిబ స్వామృత మేతదేవ
గోవింద ! దామోదర ! మాధవేతి. ౬౫

ఓ నాలుకా ! నీవు భూభారమును తగ్గించుటకు సుందర గోపవేషమును ధరించిన వాఁడును, ఆనందమయ లీలను గావించుటకై ఆదిశేషుని సోదరునిగ జేసుకొనిన వాడు నగు ఆనటనా సూత్రధారుని " గోవింద ! దామోదర ! మాధవ ! యను నామామృతమును నిరంతరము పానము జేయుము.

బకీబకాఘాసుర ! ధేనుకారే !
కేశీ తృణావర్త విఘాత దక్ష !

జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౬

ఓ నాలుకా! నీవు "పూతన, బకాసురుడు, అఘాసురుడు, ధేనుకాసురుడు మొదలగు రాక్షసులకు శత్రువైన వాడును, కేశితృణావర్తులను సంహరించిన వాడునగు నా యసురారియొక్క" గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

శ్రీజానకీజీవన! రామచంద్ర!
నిశాచరారే! భరతాగ్రజేశ!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౭

ఓనాలుకా! నీవు జానకీ జీవనుడగు నోరామా; దైత్యసంహారకుడ వగు నోభరతాగ్రజా! హేప్రభో! హే గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరమును పానము జేయుము.

నారాయణానంత హరే నృసింహ
ప్రహ్లాద బాధాహర! హేకృపాలో!
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౮

ఓనాలుకా! నీవు ప్రహ్లాదుని బాధను హరించు నో దయామయుడగు నృసింహా! నారాయణ! అనంత! హరే! గోవింద! దామోదర! మాధవ యను నీ నామామృతమును నిరంతరము పానము జేయుము.

లీలామనుష్యాకృతి రామరూప!
ప్రతాపదాసీకృత సర్వభూప!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౬౯

ఓ నాలుకా! నీవు "లీలగ మనుష్యరూపమును ధరించి రాముడైన వాడును, తన ప్రబలపరాక్రమము వలన రాజుల నందరను దాసులుగ జేసుకొన్నవాడు నగు నా నీలాంబుజ శ్యామసుందరు డగు శ్రీరామునియొక్క, గోవింద! దామోదర! మాధవ! యను నామములను నిరంతరమును జపింపుము.

శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే!
హేనాథ! నారాయణ! వాసుదేవ!
జిహ్వే! పిబ స్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౭౦

ఓ నాలుకా! నీవు "శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే! హేనాథ! నారాయణ! వాసుదేవ! గోవింద!

దామోదర! మాధవ!" యను నీనామామృతములను నిరంత రము పానము జేయుము.

వక్తుం సమర్థోపి నవక్తి కశ్చి
దహో! జనానాం వ్యసనాభిముఖ్యం
జిహ్వే! పిబ త్వామృత మేతదేవ
గోవింద! దామోదర! మాధవేతి. ౭౧

ఆహా! మనుష్యు లెంత విషయలోలురు! ఒక్కొక్కరు ఉచ్చరించ సమర్థులయ్యు భగవన్నామము నుచ్చరింపరు. కాని ఓ నాలుకా! నీవుమాత్రము గోవింద! దామోదర! మాధవ! యను నీనామామృతమును నిరంతరము పానము జేయుము.

ఇతి శ్రీ బిల్వమంగళ విరచితం బగు
శ్రీ గోవింద దామోదర స్తోత్రము
సంపూర్ణం.



# సాధన గ్రంథ మండలి, తెనాలి

స్థాపితము : 1945

## మహారాజ పోషకులు (శాశ్వతము రు 116 లు)

| | |
|---|---|
| శ్రీ జిడ్డు లింగయ్యగారు | బందరు |
| ఈదర వేంకట్రావు పంతులుగారు | ఏలూరు |
| దరిశి జానకిరామయ్యగారు | కొత్తపాలెం (దరిశి తా॥) |
| తూములూరు వెంకటశివరామయ్యగారు | నెల్లూరు |
| బొంగరాల వీరాస్వామినాయుడుగారు | కాకినాడ |
| యేజండ్ల శ్రీరాములుచౌదరిగారు | తెనాలి |
| జిల్లెళ్ల వేంకట భానోజీ తామర్ప జమీందారువారు | పేరూరు |

## రాజపోషకులు (శాశ్వతము రు 58 లు)

| | |
|---|---|
| శ్రీ రూపాకుల శివరాంగారు | హాస్ట్రాస్ |
| పాలుట్ల పాలంకయ్యగారు | గుంటూరు |
| దోనేపూడి వెంకట రమణమూర్తిగారు | కంభం |
| వేములపల్లి రాఘవయ్యచౌదరిగారు | జూపూడి |
| కలగర నాగభూషణచౌదరిగారు | ఏలూరు |
| యస్. కె. ప్రకాశరావుగారు | తెనాలి |
| స్థానం నరశింహారావుగారు | |
| కె. నరశింహారావుగారు | |
| పులిపాటి వెంకటేశ్వర్లుగారు | |
| బొంతా సత్యనారాయణ సోదరులు | |
| జొన్నాదుల రామస్వామిగారు | |
| చదలవాడ నాగేశ్వరరావుగారు | |
| సంకా వీరభద్రయ్యగారు | |

శ్రీ పెన్నా సీతారామారావుగారు (హనుకొండ) వరంగల్
పులిపాక చినపున్నయ్యగారు నిడుబ్రోలు
చెన్నుభొట్ల భానుమూర్తిగారు కాకినాడ
బులుసు సూరీడుగారు అయినవిల్లి
జయంతి బుచ్చిరామశర్మగారు ముక్తీశ్వరం
పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చావలి
దొడ్ల వెంకటరామిరెడ్డిగారు కావలి
దువ్వూరి అప్పల నరసింహాంగారు అనకాపల్లి

పోషకులు [ప్రతి సంవత్సరము రు 25 లు]

శ్రీ దుగ్గిరాల సూర్యనారాయణమూర్తిగారు తెనాలి
పులిపాటి లక్ష్మీనారాయణగారు
గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు తెనాలి
ప్రయాగ కృష్ణమూర్తిగారు
చుండూరు రామయ్యగారు
బ్రహ్మాండం వెంకటలక్ష్మీనారాయణశాస్త్రిగారు బాపట్ల
పోలిశెట్టి సోమసుందరంగారు గుంటూరు
కొత్తూరు రామయ్య, కర్పూరపు }
రామకృష్ణమూర్తిగార్లు కంపెనీ }
వినపాముల సీతారామయ్యగారు
బెండపూడి పేర్రాజుగారు చాత్రేరు
చీమలపాటి గణేశ్వరరావు పంతులుగారు
స్వామి మృతానందతీర్థ, }
కలగ అంజనేయశాస్త్రిగారు } విజయవాడ
కలగ వెంకటనారాయణగారు తోటపల్లూరు

## సభ్యులు (ప్రతి సంవత్సరము రు 10 లు)

శ్రీ కోటంరాజు కృష్ణారావుగారు — తెనాలి

ఖండ్రిక సాంబయ్యగారు

నేతి హరినారాయణగారు

విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ముక్కామల వేంకటాచలపతిరావుగారు

కొగంటి తిరుపతయ్యగారు

గాడేపల్లి వెంకటసుబ్బారావుగారు

మట్టిగుంట వీరభద్రరావుగారు

సిరిపురపు శ్రీరాములుగారు

ప్రత్తి సూర్యనారాయణగారు

అన్నంరాజు మాధవరావుగారు

పరిమి వేంకట సుబ్బారావుగారు

ముదిగొండ మృత్యుంజయుడుగారు — తెనాలి

కాజ వేంకట జగన్నాధరావుగారు

గుడివాడ హనుమంతరావుగారు

గోనుగుంట్ల సుబ్బారావుగారు

లక్కరాజు వేంకట పాండురంగ విఠల్ శర్మగారు

కాజ వేంకట నరసింహారావుగారు

అద్దేపల్లి శ్రీమన్నారాయణమూర్తిగారు

అక్కల వెంకటేశ్వర్లుగారు

ఈదర సుందరరామయ్యగారు

ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు

ఎ. సుందరరావుగారు

దార్వేమల వేంకటేశ్వరశాస్త్రిగారు

శ్రీ ఆల్లాడి వీరరాఘవస్వామిగారు
ప్రొప్రైటర్సు రూబీ యింక్స్
ప్రొప్రైటర్సు సారధి ప్రెస్
త్రిపురమల్లు శ్రీరాములుగారు
తాడేపల్లి హరినారాయణగారు
ముక్కామల రామచంద్రరావుగారు
కోటంరాజు ప్రసాదరావుగారు
యమ్. సుబ్బారాయుడుగారు
రూపాకుల సూర్యనారాయణగారు
రావినూతల నరసింహారావుగారు ఒంగోలు
తూములూరి శ్రీరామమూర్తిగారు పినపాడు
వల్లూరు వెంకటేశ్వర్లుగారు బాపట్ల
కె. మధుసూధనరావుగారు
మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు తిరుచునాపల్లి
యం. లింగమూర్తిగారు మదరాసు
సి. అలవందరయ్యగారు
ఆర్. సాంబశివరావుగారు
పిసిపాటి పిచ్చయ్యగారు ఇంకొల్లు
జరుగుల హరినారాయణగారు
ఈదర సూరయ్యగారు అయితానగరం
ఇనుకపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గార్లపాడు
వన్నాల లక్ష్మీనరసింహాంగారు గుంటూరు
వన్నాల రామకృష్ణయ్యగారు
కొన్నలగడ్డ వెంకట సుబ్రహ్మణ్యంగారు
మైళ్ళచెర్వు వీరాంజనేయశాస్త్రిగారు

శ్రీ నిడమానూరి కనకరాజుగారు

| | |
|---|---|
| కూచిభొట్ల సుబ్బారావుగారు | బొంబాయి |
| గరిమెళ్ళ వేంకటరమణ కామేశ్వరరావుగారు | గంగలకుర్రు |
| గరిమెళ్ళ శ్రీరామమూర్తిగారు | |
| శ్రీ దువ్వూరి వేంకటపతి సోమయాజులు జమీందారుగారు | |
| గొర్తి పళ్లయ్యపంతులుగారు | అగ్రహారం |
| మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు | అయినవిల్లి |
| విళ్ళ వెంకటస్వామిగారు | |
| మద్దిరాల వెంకట కామేశ్వరరావుగారు | శానపల్లిలంక |
| సమయమంతుల నాగేశ్వరరావుగారు | ర్యాలి |
| అల్లవరపు అన్నప్పగారు | ముక్తేశ్వరం |
| సలాది బాపయ్యగారు | అనాతవరం |
| సరిపల్లె విశ్వనాథంగారు | |
| కొప్పర్తి కృష్ణమూర్తిగారు | ధవళేశ్వరం |
| బులుసు పాపయ్యశాస్త్రిగారు | రాజమండ్రి |
| బులుసు సత్యనారాయణగారు | |
| చింతలూరి రామారావుగారు | |
| ద్వారకదాస్ గిరిధరదాస్ గారు | |
| టి. కనకరాజుగారు | |
| వాజపేయాజుల వెంకటేశ్వర్లుగారు | |
| జి. వరదరావుగారు | |
| ఉండవల్లి శంకర కోటేశ్వరరావుగారు | రాజమండ్రి |
| యం. సోమేశ్వరరావుగారు | |
| జిల్లా సుబ్బారాయశ్రేష్ఠిగారు | |
| మానాప్రగడ శ్రీరాములుగారు | కొవ్వూరు |

శ్రీ నందూరి రాఘవరాజుగారు

| | |
|---|---|
| బులుసు వెంకటేశ్వర్లుగారు | కాకినాడ |
| కాజ సూర్యనారాయణగారు | విజయవాడ |
| వావిలాల శ్రీనివాసరావుగారు | |
| నందిపాటి రామయ్యగారు | |
| మంథా సుబ్బారావుగారు | అమలాపురం |
| కోట పాలయ్యగారు | |
| మంగళపల్లి లక్ష్మినారాయణశాస్త్రిగారు | |
| యం. వెంకటసుబ్బారావుగారు | |
| కస్తూరి రామచంద్రమూర్తిగారు | |
| కె. జగన్మోహనరావుగారు | నేలకొండపల్లి |
| జి. లోకనాథశర్మగారు | |
| అవిరాజు అన్నారాజీరావుగారు | విజయనగరం |
| పసుమర్తి వీరభద్రస్వామిగారు | |
| కె. యన్. యన్. పట్నాయిక్ గారు | |
| జోస్యుల వెంకట సత్యనారాయణమూర్తిగారు | భట్నవిల్లి |
| గొర్తి పళ్ళయ్యశర్మగారు | నేదునూరు |
| నడింపల్లి సత్యనారాయణరాజుగారు | అంబాజీపేట |
| నూకల అమ్మన్నపంతులుగారు | నందంపూడి |
| వడ్లమాని కామేశ్వరరావుగారు | |
| నూకల లక్ష్మినారాయణగారు | |
| గంటి సుబ్బారావుగారు | |
| చల్లా సుబ్రహ్మణ్యంగారు | నరేంద్రపురం |
| ద్విభాష్యం వెంకటసూర్యనారాయణగారు | చింతలూరు |
| బూశరాజు వెంకటసుబ్బారావుగారు | స్వర్ణ |

| | |
|---|---|
| శ్రీ బూదరాజు వాసుదేవమూర్తిగారు | చీరాల |
| జాగర్లమూడి కుప్పుసామి | కారంచేడు |
| కొల్లూరు కోటయ్యచౌదరిగారు | మూల్పూరు |
| దిరిశాల రమణారెడ్డిగారు | మారెళ్ళ |
| బవరం కోటిరెడ్డిగారు | వంకాలపాడు |
| కోట శ్రీనివాసరావుగారు | నెల్లూరు |
| పుతిగళ్ళ వెంకటకృష్ణయ్యగారు | |
| చతుర్వేదుల రామచంద్రయ్య | |
| వసుమర్తి సత్యనారాయణగారు | కావలి |
| వద్దిరాజు రంగారావుగారు | హనుమకొండ |
| కె. మధుసూదనరావుగారు | |
| కురికాల వేణీరావుగారు | పరకాల |
| కురికాల వేంకటేశ్వరరావుగారు | |
| కురికాల వెంకటరామారావుగారు | |
| వద్దిరాజు వెంకటరంగారావుగారు | వరంగల్ |
| ఐ. వెంకట్రావుగారు | |
| యస్. సిద్ధాంతిగారు | |
| టి. యస్. మూర్తిగారు | |
| కె. గంగాధరరావుగారు | |
| డి. జనార్దనరావుగారు | |
| పొట్లపల్లి సత్యన్నారాయణరావుగారు | బ్రహ్మన్వాడి |
| ఉప్పల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |
| వేదాంతం వెంకటసత్యనారాయణశర్మగారు | అత్రోట |
| కొలగొట్ల సూర్యనారాయణరావుశ్రేష్ఠిగారు | పార్వతీపురం |
| యస్. పి. విశ్వనాథశర్మగారు | సికింద్రాబాదు |

గోర్తి రామమూర్తిగారు
శ్రీ తాడేపల్లి శివరామకృష్ణయ్యగారు
చిట్టా వెంకట్రామశాస్త్రిగారు
జూలూరి గజదీశ్వరయ్యగారు
జూలూరి లీరేశలింగంగారు
ఎ. కృష్ణమూర్తిగారు హైదరాబాద్
ఎమ్. కామేశ్వరరావుగారు
బి. వి. సుబ్బారాయుడుగారు
జి. మురహరిరావుగారు
వాడపల్లి మురహరిరావుగారు శర్కార్ నగర్
మాటూరి సీతారామారావుగారు మధిర
లొల్ల శంకరశాస్త్రిగారు కొల్లూరు
పురాణం వెంకట సత్యనారాయణశాస్త్రిగారు బందరు
తణికెళ్ల కృష్ణమూర్తిగారు కొత్తపేట
పి. పాపయ్యరాజుగారు పెదపాడు
డొక్కా రామావధానులుగారు పక్కలంక